# స్తోత్రములు వగైరా గ్రంథములు

| | రు | అ | | రు | అ |
|---|---|---|---|---|---|
| శనిస్తోత్రం | 0 | 6 | శ్రీరామగీతా తా॥ స॥ | 0 | 6 |
| దేవీమానసికపూజ | 0 | 2 | ఋభుగీత | 0 | 12 |
| నారాయణకవచం తాత్పర్య సహితం | 0 | 4 | వైశ్యత్రైకాల సంధ్యావందనం | 0 | 4 |
| వట్సలపూజావిధానము | 0 | 4 | బ్రహ్మగీత | 0 | 12 |
| గీతార్థసారం | 0 | 1 | భగవద్గీత దండకం | 0 | 2 |
| గీతామాహాత్మ్యము | 0 | 1 | వైష్ణవసంధ్యావందనం తా॥ | 0 | 4 |
| యజ్ఞోపవీతధారణవిధి | 0 | 1 | ఆంధ్రద్రావిడసంధ్యావందనం | 0 | 4 |
| ప్రాతఃస్మరణము | 0 | 4 | ఋగ్వేదసంధ్యావందనం | 0 | 4 |
| శ్రీరామహృదయం తాత్పర్యసహితం | 0 | 4 | యజుర్వేద సంధ్యావందనం | 0 | 4 |
| | | | దేవీఖడ్గమాల | 0 | 2 |
| | | | స్నానసంకల్పం | 0 | 4 |

# సహస్రనామములు

| | రు | అ | | రు | అ |
|---|---|---|---|---|---|
| విష్ణుసహస్రనామములు | 0 | 6 | శ్రీరామసహస్రనామములు | 0 | 4 |
| లలితసహస్రనామములు | 0 | 4 | భవానీసహస్రనామములు | 0 | 4 |
| ఆంజనేయసహస్రనామములు | 0 | 4 | కాళికసహస్రనామములు | 0 | 4 |
| శ్రీకృష్ణసహస్రనామములు | 0 | 4 | గంగాసహస్రనామములు | 0 | 4 |
| వేంకటేశ్వరసహస్రనా॥లు | 0 | 4 | గణపతిసహస్రనామములు | 0 | 4 |
| గోపాలసహస్రనామములు | 0 | 4 | సుబ్రహ్మణ్యసహస్రనా॥లు | 0 | 4 |
| దుర్గాసహస్రనామములు | 0 | 4 | సరస్వతీసహస్రనామములు | 0 | |
| లక్ష్మీసహస్రనామములు | 0 | 4 | గాయత్రీసహస్రనామములు | 0 | 4 |
| శివసహస్రనామములు | 0 | 4 | సూర్యసహస్రనామములు | 0 | 4 |

శ్రీరస్తు

# అమరకోశము

అను

# నామలింగానుశాసనము

ప్రథమకాండము

సటీకము

"పండితవర్య"

శ్రీమదమరసింహ విరచితము.

సంస్కర్త:

సమనూరి గంగాధరంగారు


పబ్లిషర్సు:

శ్రీ సత్యనారాయణ బుక్. డిపో,

బుక్ సెల్లర్సు అండ్ పబ్లిషర్సు,

రాజమండ్రి.

1945




[వెల రు 0-8-0

శ్రీరస్తు

# అమరకోశము

## ప్రథమకాండము

[సటీకము]

అవతరణిక — శ్రీమదమరసింహుఁడను కవిచంద్రుఁడు లోకోపకారార్థము నామలింగానుశాసనమను గ్రంథమును రచియింపఁబూని గ్రంథము నిర్విఘ్నముగా సమాప్తినొందుట కొఱకు యిష్టదేవతా నమస్కారరూపంబైన మంగళమును జేయుచున్నాఁడు.

శ్లో. యస్య జ్ఞానదయాసిన్ధో రగాధస్యానఘా గుణాః
సేవ్యతామక్షయో ధీరాః స శ్రియే చామృతాయ చ ౧.

తాత్పర్యము:— ద్వైతాద్వైతవిశిష్టాద్వైతము లనంబడు త్రివిధ మతావలంబులైన ఓ పండితులారా! జ్ఞానమునకును, దయకును, జలమునకు సముద్రునివలె నాధారభూతుఁడును, అతిగంభీరుఁడునైన యే దేవునికి రాగాదిదోషగుణములు లేవో, నాశరహితుఁడైన నా పరమాత్ముఁడు, సంపదకొఱకును, మోక్షముకొఱకును సేవింపఁబడుఁగాక.

అవతారిక:—చదివెడువారికి రుచిపుట్టుటకై తాను రచియింపఁబూనిన గ్రంథమునకు పేరుతోఁ గూడ ప్రయోజన మును జెప్పుచున్నాఁడు.

శ్లో. సమాహృత్యాన్యతన్త్రాణి సంక్షిప్తైః ప్రతిసంస్కృతైః
సంపూర్ణ ముచ్యతే వర్గై ర్నామలిఙ్గానుశాసనమ్. ౨

తా. —వరరుచి వాచస్పతి చంద్రగోమినామకాదులు చెప్పిన త్రికాండి, ఉత్పలిని మొదలైన యితరగ్రంథములను సంగ్రహించి సంక్షేపింపఁబడిన సమాసయుక్తపదములచేతను లింగ నిర్ణయాదులచేతను, శోభింపఁబడిన, తమలో సంబంధముగల పదసమూహము చేత నిండియున్న వర్గులతోఁగూడుకొనిన నామ లింగానుశాసనము నిఘంటువుఁ జెప్పఁబడుచున్నది.

విశేషాంశము:—నామలింగములు దీనిచేత నిర్ణయింపఁ బడును గావున నీగ్రంథము "నామలింగానుశాసనము" అమరసింహాకవి కృతంబగుటచేత "అమరము" అను పేరులతో నీయుత్తమ నిఘంటు వొప్పుచున్నది. ఉత్పలిన్యాదులు సంక్షిప్తములు గాకను, నామమాలాదులు లింగములు లేనివిగను, అమర మాలాదులు అసంపూర్ణములుగను గోలోమాద్యాదులు వర్గుప్తులు లేనివిగను ఉన్నవి. కనుక యీ నిఘంటు వన్నియు గల్గియుండుటచేత నన్నిటికంటె మిక్కిలి శ్లాఘనీయమైనది.

అవతరణిక:—ప్రతిపదమునకు లింగమును జెప్పినచో గ్రంథము విస్తరించును. చెప్పనిచో గ్రంథము సంపూర్ణము

అవతారిక:—చదివెడు వారికి రుచిపుట్టుటకై తాను రచియింపఁబూనిన గ్రంథమునకు పేరుతోఁ గూడ ప్రయోజనమును జెప్పుచున్నాఁడు.

శ్లో. సమాహృత్యాన్యతన్త్రాణి సంక్షిప్తైః ప్రతిసంస్కృతైః
సంపూర్ణముచ్యతే వర్గైర్నామలిఙ్గానుశాసనమ్. ౨

తా. —వరరుచి వ్యాడి చంద్రగోమినామవాదులు చెప్పిన త్రికాండి, ఉత్పలిని మొదలైన యితరగ్రంథములను సంగ్రహించి సంక్షేపింపఁబడిన పర్యాయపదముల చేతను లింగ నిర్ణయాదుల చేతను, శోభింపఁబడిన, తమలో సంబంధముగల పదసమూహము చేత నిండియున్న వర్గములతోఁ గూడుకొనిన నామ లింగానుశాసనము నిఘంటువుఁ జెప్పఁబడుచున్నది.

విశేషాంశము:—నామలింగములు దీనిచేత నిర్ణయింపఁబడును గావున నీగ్రంథము "నామలింగానుశాసనము" అమరసింహాకవి కృతంబగుటచేత "అమరము" అను పేరులతో నీయుత్తమ నిఘంటు వొప్పుచున్నది. ఉత్పలినీ శాస్త్రాదులు సంక్షిప్తములు గాకను, నామమాలాదులు లింగములు లేనివిగను, అమరమాలాదులు అసంపూర్ణములుగను గోలోమ్యాదులు వర్గములు లేనివిగను ఉన్నవి. కనుక యీ నిఘంటు వన్నియు గల్గియుండుటచేత సన్నుతింపఁబడి మిక్కిలి శ్లాఘనీయమైనది.

అవతారిక:—ప్రతిపదమునకు లింగమును జెప్పినచో గ్రంథము విస్తరించును. చెప్పనిచో గ్రంథము సంపూర్ణము

తా. ఈగ్రంథమునందు స్థలాంతరమున లింగములతో జెప్పఁబడని వేఱువేఱు లింగములు గల పదములకు లింగభేదములు జెప్పుట కొఱకు ద్వంద్వసమాసము నేకశేషములు చెప్పలేదు. అభిన్నలింగములకును, స్థలాంతరమునందలి భిన్నలింగములకును జెప్పియున్నది. ప్రస్తావమువలన భిన్నలింగములకు సాంకర్యము గలదు

అ దెట్లనిన:—అభిన్నలింగములకు "ద్యోదివౌ ద్వేస్త్రియామ్" "స్వర్గనాకత్రిదివత్రిదశాలయాః" ఇట్టిచోట్ల ద్వంద్వసమాసమును, "నాసత్యావశ్వినౌ" "జీమూతౌ మేఘపర్వతౌ" ఇట్టి స్థలముల నేకశేషమును జేయఁబడినది. స్థలాంతరమందుఁ జెప్పఁబడిన భిన్నలింగములకు, "విద్యాధరోప్సరో యక్షరక్షో గన్ధర్వకిన్నరాః" ఇట్టిచోటుల ద్వంద్వంబును, "శ్వశ్రూశ్వశురౌ" ఇట్టి పట్టులందు నేకశేషమును జేయంబడియున్నవి. ప్రస్తావంబువలన భిన్నలింగములకు సాంకర్య మెట్లనిన; స్వర్గపర్యాయనామాలందు ద్యోదివాదిశబ్దములున్న, హరినామాది ప్రస్తావంబులందు లక్ష్మి, గౌరి మొదలగు శబ్దములును చెప్పఁబడియున్నవి.

అవతరణిక :—విశేషవిధులందు స్త్రీ పున్నపుంసకమని చెప్పిన యధికమగును. కావున వర్ణలాఘవము కొఱకు గొన్ని సంజ్ఞలు వివరింపుచున్నాఁడు.

శ్లో. త్రిలిఙ్గ్యాం త్రిష్వితి పదం మిథునే తు ద్వయోరితి,
నిషిద్ధలిఙ్గం శేషార్థం త్వన్తాథాది న పూర్వభాక్. ౫

తా. మూఁడు లింగములయందు నని చెప్పవలసినప్పుడు "త్రిషు" అని చెప్పఁబడును. స్త్రీలింగ పురుషలింగములు చెప్పు

నప్పుడు "ద్వయోః" అని చెప్పఁబడును. నిషేధింపఁబడిన లింగముగల పదము నిషేధింపఁబడని కడమలింగములయందు గలదని చెప్పబడును "తు" శబ్దము అంతమందుగల పదమును "అథ" శబ్దము ఆదియందుగల పదమును పూర్వపదముతో సంబంధించవు.

అదెట్లనిన:—"తటం త్రిషు" ఇచ్చట తటశబ్దము స్త్రీ పుంనపుంసకములయందు వర్తించునని చెప్పక "త్రిషు" అని చెప్పఁబడును. "అశనిర్ద్వయోః" ఇచ్చట అశని శబ్దము స్త్రీ పుల్లింగములందు వర్తించునని చెప్పక "ద్వయోః" అని చెప్పబడెను. "ద్వీపో౽స్త్రీ యామన్తరీపమ్" ఇక్కడ "అస్త్రీ యాం" అని ద్వీపశబ్దమును చెప్పుటచే స్త్రీలింగనిషేధంబువలన పుంలింగనపుంసకలింగములుగలది యగుచున్నది. "అవశ్యాయస్తు నీహారః" ఇక్కడ "తు" శబ్దము అంతమందుగల "అవశ్యాయ" పదము తననామమునే తెల్పునదిగాని, పూర్వపదములతో సంబంధించదు. "అథ కేసరే వకుళః" ఇచ్చట "కేసర" శబ్దము తనయర్థమును వకుళ, వంజుళ శబ్దములకుఁ జెప్పునే గాని, గంధఫలీశబ్దమునకుఁ జెప్పదు. కనుక పూర్వపదములతో సంబంధించదు.

అవతారణిక:—"నామలింగాను శాసనము" మూఁడు కాండములుం గలది. ప్రథమ కాండమునందు, స్వర్గపాతాళ లోకములందలి సంబంధములు చెప్పఁబడెను.

---

## స్వర్గవర్గము.

స్వరవ్యయం స్వర్గనాకత్రిదివ త్రిదశాలయాః సురలోకో ద్యౌ దివౌ (ద్వే స్త్రియాం) (క్లీబే) త్రివిష్టపమ్.

స్వః, స్వర్గః, నాకః, త్రిదివః, త్రిదశాలయః, సురలోకః, ద్యౌః, దివః, త్రివిష్టపమ్ ౬ స్వర్గము పేళ్ళు.

అమరా నిర్జరా దేవా స్త్రిదశా విబుధా స్సురాః, సుపర్వాణ స్సుమనస స్త్రిదివేశా దివౌకసః ॥ ౭ ఆదితేయా దివిషదో లేఖా అదితినన్దనాః ఆదిత్యా ఋభవో౽స్వప్నా అమర్త్యా అమృతాన్ధసః ౮ బర్హిర్ముఖాః క్రతుభుజో గీర్వాణా దానవారయః, బృన్దారకా దైవతాని (పుంసివా) దేవతాః స్త్రియామ్. ౯

అమరాః, నిర్జరాః, దేవాః, త్రిదశాః, విబుధాః, సురాః, సుపర్వాణః, సుమనసః, త్రిదివేశాః, దివౌకసః, ఆదితేయాః, దివిషదః, లేఖాః, అదితినన్దనాః, ఆదిత్యాః, ఋభవః, అస్వప్నాః, అమర్త్యాః, అమృతాన్ధసః, బర్హిర్ముఖాః, క్రతుభుజః, గీర్వాణాః, దానవారయః, బృన్దారకాః, దైవతాని, దేవతాః ఈ ౨౬ దేవతల పేళ్ళు (ఈ దేవతా వాచకములు బహువచనమునందు ప్రయోగింపఁబడుట చేత, ప్రథమా బహువచనాంతములుగా నిర్ణయించెను. కనుక నిత్య బహువచనములు కావు.)

ఆదిత్యవిశ్వవసవస్తుషితాభాస్వరానిలాః, మహారాజిక సాధ్యాశ్చ రుద్రాశ్చ (గణదేవతాః)

ఆదిత్యాః ౧౨, విశ్వే ౧౦ వసవః ౮, తుషితాః ౩౬, ఆభాస్వరాః ౬౪, అనిలాః ౪౯ మహారాజికాః ౨౨౦, సాధ్యాః ౧౨, రుద్రాః ౧౧ ఈ ౯ గణ దేవతాజాతుల పేళ్ళు.

అష్టకసారము

శ్లో. ఆదిత్యా ద్వాదశ ప్రోక్తా విశ్వేదేవా దశస్మృతాః
వసవశ్చాష్టసంఖ్యాతాః షట్త్రింశస్తుషితా మతాః
ఆభాస్వరా శ్చతుష్షష్టి ర్వాతాః పంచాశదూనకాః
మహారాజికనామానో ద్వేశతే వింశతి స్తథా
సాధ్యా ద్వాదశవిఖ్యాతా రుద్రా ఏకాదశస్మృతాః.

విద్యాధరోఽప్సరో యక్ష రక్షో గన్ధర్వకిన్నరాః పిశాచో గుహ్యకస్సిద్ధో భూతోఽమీ (౧౦వి దేవ యోనయః) ౧౧

విద్యాధరః (జీమూతవాహనుడు మొదలగువారు) అప్సరాః (ఊర్వశి మొదలగు దేవాంగనలు) యక్షః (కుబేరుడు మొదలగు వారు) రక్షః (లంకావాసులగు విభీషణుండు మొదలగువారు) గన్ధర్వః (తుంబురుడు మొదలైన వారు) కిన్నరః (అశ్వముఖులు) పిశాచః (మాంసాశనులు) గుహ్యకః (నిధిపాలకులగు మణిభద్రా

దులు) సిద్ధాః (విశ్వావసు మొదలగువారు) భూతాః (రుద్రానుచరులైన బాలగ్రహాదులు) ఈ ౧౦ విధములు, అవియూ= వీరలు, దేవయోనయః=దేవతలలో జన్మించినవారు

అసురా దైత్యదైతేయదనుజేన్ద్రారిదానవాః, శుక్రశిష్యా దితిసుతాః పూర్వదేవాస్సురద్విషః

అసురాః దైత్యాః దైతేయాః దనుజాః ఇన్ద్రారయః దానవాః, శుక్రశిష్యాః దితిసుతాః, పూర్వదేవాః సురద్విషః ఈ ౧౦ అసురుల పేరులు.

సర్వజ్ఞస్సుగతో బుద్ధో ధర్మరాజస్తథాగతః, సమన్తభద్రో భగవాన్మారజిల్లోకజిజ్జినః॥ ౧౩ షడభిజ్ఞో దశబలోఽద్వయవాదీ వినాయకః మునీన్ద్రశ్శ్రీఘనశ్శాస్తా మునిః (శాక్యముని స్తు యః) ౧౪ స శాక్యసింహస్సర్వార్థసిద్ధశ్శౌద్ధోదనిశ్చ (సః), గౌతమశ్చార్కబన్ధుశ్చ మాయాదేవీసుతశ్చ (సః) ౧౫

సర్వజ్ఞః, సుగతః బుద్ధః ధర్మరాజః, తథాగతః, సమన్తభద్రః, భగవాన్, మారజిత్ లోకజిత్, జినః, షడభిజ్ఞః, దశబలః, అద్వయవాదీ, వినాయకః మునీన్ద్రః శ్రీఘనః, శాస్తా, మునిః ఈ ౧౮ బుద్ధదేవుని పేరులు. శాక్యసింహః, సర్వార్థసిద్ధః శౌద్ధోదనిః, గౌతమః అర్కబన్ధుః మాయాదేవీసుతః ఈ ౬ శాక్యవంశమున

జన్మించిన బుద్ధవాంతర భేదములగల బుద్ధభగవానుని నామములు.

బ్రహ్మాత్మభూస్సురజ్యేష్ఠః పరమేష్ఠీ పితామహః
హిరణ్యగర్భో లోకేశస్స్వయంభూశ్చతురాననః ॥ ౧౬ ॥ ధాతాబ్జయోనిర్ద్రుహిణో విరిఞ్చిః కమలాసనః స్రష్టా ప్రజాపతిర్వేధా విధాతా విశ్వసృడ్విధిః ॥ ౧౭ ॥
(శతానన్దశ్శతధృతిర్వైరిఞ్చోఽజో విరిఞ్చనః) అధిక పాఠము

బ్రహ్మ, ఆత్మభూః, సురజ్యేష్ఠః, పరమేష్ఠి, పితామహః, హిరణ్య గర్భః, లోకేశః, స్వయంభూః, చతురాననః, ధాతా, అబ్జయోనిః, ద్రుహిణః, విరిఞ్చిః, కమలాసనః, స్రష్టా, ప్రజాపతిః, వేధాః, విధాతా, విశ్వసృట్, విధిః ఈ ౨౦ బ్రహ్మదేవుని పేరులు (శతానన్దః, శతధృతిః, విరిఞ్చిః, అజః, విరిఞ్చనః) అధిక పాఠము

బొంబాయిప్రతియందుండు అధిక పాఠము.

[నాభిజన్మాఽణ్డజః పూర్వో నిధనః కమలోద్భవః
సదానన్దో రజోమూర్తిః సత్యకో హంసవాహనః.]

విష్ణుర్నారాయణః కృష్ణో వైకుణ్ఠో, విష్టరశ్రవా దామోదరో హృషీకేశః కేశవో మాధవస్స్వభూః ॥ ౧౮ ॥ దైత్యారిః పుణ్డరీకాక్షో గోవిన్దో గరుడధ్వజః, పీతామ్బరో

విష్ణుః, నారాయణః, కృష్ణః, వైకుణ్ఠః, విష్టరశ్రవాః, దామోదరః, హృషీకేశః, కేశవః, మాధవః, స్వభూః, దైత్యారిః, పుణ్డరీకాక్షః, గోవిన్దః, గరుడధ్వజః, పీతాంబరః, అచ్యుతః,

ఽచ్యుత శ్శార్ఙ్గీ విష్వక్సేనో జనార్దనః ఉపేన్ద్ర ఇన్ద్రావరజ శ్చక్రపాణి శ్చతుర్భుజః పద్మనాభో మధురిపు ర్వాసుదేవ స్త్రివిక్రమః. ౨౦ దేవకీనన్దన శ్శౌరి శ్శ్రీపతిః పురుషోత్తమః వనమాలీ బలిధ్వంసీ కంసారాతి రధోక్షజః, ౨౧ విశ్వంభరః కైటభజి ద్విధు శ్శ్రీవత్సలాఞ్ఛనః ౨౨ [గదాగ్రజో హృషీకేశో దామోదరో దశరూపభృత్.] అధిక పాఠము.

శార్ఙ్గీ, విష్వక్సేనః, జనార్దనః, ఉపేన్ద్రః ఇన్ద్రావరజః, చక్రపాణిః, చతుర్భుజః, పద్మనాభః మధురిపుః, వాసుదేవః, త్రివిక్రమః, దేవకీనన్దనః, శౌరిః శ్రీపతిః పురుషోత్తమః, వనమాలీ, బలిధ్వంసీ, కంసారాతిః, అధోక్షజః, విశ్వంభరః, కైటభజిత్, విధుః, శ్రీవత్సలాఞ్ఛనః ఈ ౩౯ శ్రీమహావిష్ణువు పేర్లు. (గదాగ్రజః హృషీకేశః, దామోదరః, దశరూపభృత్) అధిక పాఠము.

బొంబాయిప్రతియందుండు అధిక పాఠము.

శ్లో. పురాణపురుషో యజ్ఞపురుషో నరకాన్తకః,
జలశాయీ విశ్వరూపో ముకున్దో మురమర్దనః

పురాణపురుషః, యజ్ఞపురుషః నరకాన్తకః, జలశాయీ, విశ్వరూపః, ముకున్దః, మురమర్దనః.

వసుదేవో (ఽస్యజనకస్స ఏవా) ఽఽనకదున్దుభిః ౨౨

వసుదేవః, ఆనకదున్దుభిః. ౨ అస్యజనకః=శ్రీకృష్ణుని తండ్రియగు వసుదేవుని పేర్లు

బలభద్రః ప్రలమ్బఘ్నో బలదేవో ఽచ్యుతాగ్రజః రేవతీరమణో రామః కామపాలో హలాయుధః ౨౩ నీలామ్బరో రౌహిణేయస్తాలాఙ్కో ముషలీ హలీ, సఙ్కర్షణ స్సీరపాణిః కాలిన్దీభేదనో బలః ౨౪

బలభద్రః, ప్రలమ్బఘ్నః, బలదేవః, అచ్యుతాగ్రజః, రేవతీరమణః, రామః, కామపాలః, హలాయుధః, నీలామ్బరః, రౌహిణేయః, తాలాఙ్కః, ముసలీ, (పా॥ ముషలీ) హలీ, సంకర్షణః, సీరపాణిః, కాలిన్దీభేదనః, బలః ఈ ౧౭ బలరాముని పేరులు

మదనో మన్మథో మారః ప్రద్యుమ్నో మీనకేతనః కన్దర్పో దర్పకో ఽనఙ్గః కామః పఞ్చశరః స్మరః. ౨౫ శమ్బరారి ర్మనసిజః కుసుమేషురనన్యజః. పుష్పధన్వా రతిపతిర్మకరధ్వజ ఆత్మభూః ౨౬

మదనః, మన్మథః, మారః, ప్రద్యుమ్నః, మీనకేతనః, కన్దర్పః, దర్పకః, అనఙ్గః, కామః, పఞ్చశరః, స్మరః, శమ్బరారిః, (పా॥ సమ్బరారిః) మనసిజః, కుసుమేషుః, అనన్యజః, పుష్పధన్వా, రతిపతిః, మకరధ్వజః, ఆత్మభూః ఈ ౧౯ మన్మథుని పేరులు.

శృఙ్గారయోని స్త్రీపుత్రో రుద్రారిః కన్తు కాయజౌ ఇక్షుచాపో మధుసఖ శ్శూర్పకారాతిహృచ్ఛయౌ. అ॥ పా॥

శృఙ్గారయోనిః, స్త్రీపుత్రః, రుద్రారిః, కన్తుః, కాయజః, ఇక్షుచాపః, మధుసఖః, శూర్పకారాతిః, హృచ్ఛయః, అ॥ పా॥

బ్రహ్మసూర్విశ్వకేతు (స్స్యా) దనిరుద్ధ ఉషాపతిః.

బ్రహ్మసూః, విశ్వకేతుః, (పా; ఋష్యకేతుః) అనిరుద్ధః, ఉషాపతిః ఈ ౪ అనిరుద్ధుని పేరులు.

[అరవిన్దమశోకం చ చూతం చ నవమల్లికా, నీలోత్పలం చ పఞ్చైతే పఞ్చబాణస్య సాయకాః.]

అరవిన్దమ్, అశోకమ్, చూతమ్, నవమల్లికా, నీలోత్పలం ఈ 5 మన్మథుని బాణములు

లక్ష్మీః పద్మాలయా పద్మా కమలా శ్రీర్హరిప్రియా. ౨౭

లక్ష్మీః, పద్మాలయా, పద్మా, కమలా, శ్రీః, హరిప్రియా ఈ ౬ లక్ష్మీదేవి పేర్లు

[ఇన్దిరా లోకమాతా మా రమా మఙ్గళదేవతా, భార్గవీ లోకజననీ క్షీరసాగరకన్యకా] అధికపాఠము.

ఇన్దిరా, లోకమాతా, మా, రమా, మఙ్గళదేవతా, భార్గవీ, లోకజననీ, క్షీరసాగరకన్యకా అధికపాఠము.

(శఙ్ఖో లక్ష్మీపతేః) పాఞ్చజన్యః (శ్చక్రం సుదర్శనమ్ కౌమోదకీ) (గదా) (ఖడ్గో) నన్దకః కౌస్తుభో (మణిః) ౨౮

పాఞ్చజన్యః, విష్ణుదేవుని శఙ్ఖము పేరు. సుదర్శనమ్, విష్ణుదేవుని చక్రము పేరు, కౌమోదకీ విష్ణుదేవుని గద పేరు. నన్దకః, విష్ణుదేవుని ఖడ్గము పేరు. కౌస్తుభః, విష్ణువు ధరించు మణి పేరు.

(చాప) శ్శార్ఙ్గం మురారేస్తు శ్రీవత్సో (లాఞ్ఛనం) మతమ్,

శార్ఙ్గమ్, విష్ణుదేవుని ధనుస్సు పేరు. శ్రీవత్సః, విష్ణుదేవుని

(అశ్వాశ్చ శైబ్యసుగ్రీవమేఘపుష్పవలాహకాః (సారథి) ర్దారుకో (మన్త్రీ) హ్యుద్ధవ (శ్చానుజో గదః)

గుఱ్ఱములందలి ప్రత్యేకముచ్చ పేరు. శైబ్యః, సుగ్రీవః, మేఘపుష్పః, వలాహకః ఈ 4 శ్రీకృష్ణుని తేరిగుఱ్ఱముల పేళ్ళు. దారుకః, సారథిపేరు. ఉద్ధవః, మంత్రిపేరు. గదః, సోదరుని పేరు. [అధిక పాఠము]

గరుత్మాన్ గరుడ స్తార్క్ష్యో వైనతేయః ఖగేశ్వరః నాగాన్తకో విష్ణురథ స్సుపర్ణః పన్నగాశనః ౨౯

గరుత్మాన్, గరుడః, తార్క్ష్యః, వైనతేయః, ఖగేశ్వరః, నాగాన్తకః, విష్ణురథః సుపర్ణః పన్నగాశనః ఈ ౯ విష్ణువాహనమగు గరుత్మంతుని పేళ్ళు.

శంభురీశః పశుపతి శ్శివ శ్శూలీ మహేశ్వరః, ఈశ్వర శ్శర్వ ఈశాన శ్శంకర శ్చన్ద్రశేఖరః ౩౦ భూతేశః ఖణ్డపరశు ర్గిరీశో గిరిశో మృడః మృత్యుఞ్జయః కృత్తివాసాః పినాకీ ప్రమథాధిపః ౩౧ ఉగ్రః కపర్దీ శ్రీకణ్ఠ శ్శితికణ్ఠః కపాలభృత్, వామదేవో మహాదేవో విరూపాక్ష స్త్రిలోచనః ౩౨ కృశానురేతా

శంభుః, ఈశః, పశుపతిః, శివః శూలీ, మహేశ్వరః, ఈశ్వరః, శర్వః, (పా॥సర్వః) ఈశానః, శఙ్కరః, చంద్రశేఖరః, భూతేశః, ఖణ్డపరశుః, గిరీశః గిరిశః, మృడః, మృత్యుఞ్జయః, కృత్తివాసాః, పినాకీ ప్రమథాధిపః, ఉగ్రః, కపర్దీ శ్రీకణ్ఠః, శితికణ్ఠః, కపాలభృత్, వామదేవః, మహాదేవః విరూపాక్షః, త్రిలోచనః, కృశా

(బ్రాహ్మ్యాద్యాస్తు) మాతరః. 37

శివుని ధనుస్సుపేళ్ళు, ప్రమథాః, పారిషదాః ఈ 2 నంది మొదలగు ప్రమథగణముల పేరులు. మాతరః ఈ 1 బ్రాహ్మి మొదలగు సప్తమాతృకల పేరులు.

అధికపాఠము.

[శ్లో. బ్రాహ్మీ మాహేశ్వరీ చైవ కౌమారీ వైష్ణవీ తథా,
వారాహీ చైవ చేన్ద్రాణీ చాముణ్డా సప్తమాతరః]

విభూతి ర్భూతి రైశ్వర్య (మణిమాదిక మష్టధా)

విభూతిః, భూతిః, ఐశ్వర్యమ్ ఈ 3 అష్టధా (వర్తమానం) అణిమాదికమ్=అణిమాద్యష్టసిద్ధుల పేరులు

అధికపాఠము.

శ్లో. అణిమా మహిమా చైవ గరిమా లఘిమా తథా,
ప్రాప్తిః ప్రాకామ్య మీశిత్వం వశిత్వం చాష్టభూతయః.

ఉమా కాత్యాయనీ గౌరీ కాళీ హైమవతీశ్వరీ. 38

ఉమా, కాత్యాయనీ, గౌరీ, కాళీ, హైమవతీ, ఈశ్వరీ

శివా భవానీ రుద్రాణీ శర్వాణీ సర్వమఙ్గళా అపర్ణా పార్వతీ దుర్గా మృడానీ చణ్డికా ఉమ్బికా. 38

శివా, భవానీ, రుద్రాణీ శర్వాణీ, సర్వమఙ్గళా, అపర్ణా పార్వతీ, దుర్గా, మృడానీ, చణ్డికా, అమ్బికా ఈ 1౭

శివునిభార్యయగు పార్వతీదేవి పేరులు.

[ఆర్యా దాక్షాయణీ చైవ గిరిజా మేనకాత్మజా] అ॥ పా॥

ఆర్యా, దాక్షాయణీ, గిరిజా, మేనకాత్మజా అ॥ పా॥

వినాయకో విఘ్నరాజ ద్వైమాతుర గణాధిపాః, (అ) ప్యేకదన్త హేరమ్బ లమ్బోదర గజాననాః. ౩౮

వినాయకః, విఘ్నరాజః, ద్వైమాతురః, గణాధిపః, ఏకదన్తః, హేరమ్బః, లమ్బోదరః, గజాననః, ఈ ౮ వినాయకుని పేరులు.

కార్తికేయో మహాసేన శ్శరజన్మా షడాననః, పార్వతీనన్దన స్స్కన్ద స్సేనానీ రగ్నిభూ ర్గుహః ౩౯ బాహులేయ స్తారకజి ద్విశాఖ శ్శిఖివాహనః షాణ్మాతుర శ్శక్తిధరః కుమారః క్రౌఞ్చదారణః ౪౦

కార్తికేయః, మహాసేనః, శరజన్మా, షడాననః, పార్వతీనన్దనః, స్కన్దః, సేనానీః, అగ్నిభూః, గుహః, బాహులేయః, తారకజిత్, విశాఖః, శిఖివాహనః, షాణ్మాతురః, శక్తిధరః, కుమారః, క్రౌఞ్చదారణః ఈ ౧౭ కుమారస్వామిపేరులు.

అధికపాఠము.

[శ్లో॥ శృఙ్గీ భృఙ్గిరిట స్తుణ్డీ నందినో నన్ది కేశ్వరః
నన్దికేశ్వరుని పేళ్ళు.

శ్లో॥ కర్మమోటీ తు చాముణ్డా చర్మముణ్డా తు చర్చికా.
శివపరిచారికల పేళ్ళు.

ఇన్ద్రో మరుత్వాన్ మఘవా బిడౌజాః పాకశాసనః, వృద్ధశ్రవాః సునాసీరః పురుహూతః పురన్దరః ౪౧ జిష్ణు ర్లేఖర్షభ శ్శక్ర శ్శతమన్యు ర్దివస్పతిః, సుత్రామా గోత్రభి ద్వజ్రీ వాసవో వృత్రహా వృషా ౪౨ వాస్తోష్పతి స్సురపతి ర్బలారాతి శ్శచీపతిః, జమ్భభేదీ హరిహయ స్స్వారా ణ్నముచిసూదనః ౪౩ సంక్రన్దనో దుశ్చ్యవన స్తురాషా ణ్మేఘవాహనః ఆఖణ్డలస్సహస్రాక్షః ఋభుక్షా, తస్యతుప్రియా ౪౪

ఇన్ద్రః, మరుత్వాన్, మఘవా, బిడౌజాః సీపాకశాసనః, వృద్ధశ్రవాః సునాసీరః, పురుహూతః, పురన్దరః, జిష్ణుః, లేఖర్షభః, శక్రః శతమన్యుః, దివస్పతిః, సుత్రామా, గోత్రభిత్, వజ్రీ, వాసవః, వృత్రహా, వృషా, వాస్తోష్పతిః, సురపతిః బలారాతిః, శచీపతిః, జమ్భభేదీ, హరిహయః, స్వారాట్ నముచిసూదనః, సంక్రన్దనః, దుశ్చ్యవనః, తురాషాట్, మేఘవాహనః, ఆఖణ్డలః సహస్రాక్షః, ఋభుక్షాః ఈ 3౫ దేవేంద్రుని పేరులు.

శ్లో. ప్రాచీనబర్హి రహింహా। వృత్రజాషా ట్పులోమ జిత్॥ అధికపాఠము.

ప్రాచీనబర్హిః, అహింహః, వృత్రనాషాట్, పులోమజిత్ అధికపాఠము.

పులోమజా శచీన్ద్రాణీ (నగరీ) త్వమరావతీ.

పులోమజా, శచీ, ఇన్ద్రాణీ ఈ 3 ఇంద్రుని భార్య పేర్లు. అమరావతీ ఈ ౧ ఇంద్రుని పురము పేరు.

(హయ) ఉచ్చైశ్శ్రవా (స్సూతో) మాతలి ర్నన్దనం (వనమ్) ౪౫ (స్యాత్ప్రాసాదో) వైజయన్తో జయన్తః పాకశాసనిః

ఉచ్చైశ్శ్రవాః ఈ ౧ అతని గుఱ్ఱముపేరు. మాతలిః ఈ ౧ అతని సారథిపేరు. నన్దనమ్ ఈ ౧ అతని వనముపేరు. వైజయన్తః ఈ ౧ అతని మేడపేరు. జయన్తః, పాకశాసనిః ఈ ౨ అతని కుమారునిపేళ్ళు.

ఐరావతో ఽభ్రమాతఙ్గైరావణాభ్రమువల్లభాః. ౪౬

ఐరావతః, అభ్రమాతఙ్గః, ఐరావణః, అభ్రమువల్లభః ఈ ౪ అతని యేనుగుపేరులు.

హ్రాదినీ, వజ్ర, (మస్త్రీ స్యాత్) కులిశం భిదురం పవిః శతకోటి స్స్వరు శ్శమ్బో దంభోళి రశని (ర్ద్వయోః) ౪౭

హ్రాదినీ, వజ్రమ్, కులిశమ్, భిదురమ్, పవిః, శతకోటిః, స్వరుః, శమ్బః, దమ్భోళిః, అశనిః ఈ ౧౦ వజ్రాయుధము పేరులు.

వ్యోమయానం విమానో (ఽస్త్రీ) (నారదాద్యా)స్సురర్షయః, (స్యాత్) సుధర్మా దేవసభా పీయూష మమృతం సుధా. ౪౮ మన్దాకినీ వియద్గఙ్గా స్వర్ణదీ సురదీర్ఘికా మేరు స్సుమేరు ర్హేమాద్రీ రత్నసానుస్సురాలయః ౪౯ (పఞ్చై

వ్యోమయానమ్, విమానః ఈ ౨ దేవరథములపేళ్లు. సురర్షయః ఈ ౧ నారదుఁడు దేవలుఁడు మొదలైన దేవతల పేళ్ళు. సుధర్మా, (పా॥ సుధర్మన్), దేవసభా ఈ ౨ దేవతలసభకు పేళ్ళు. పీయూషమ్, అమృతమ్, సుధా ఈ 3 అమృ

తే దేవతరవో) మన్దారః పారిజాతకః, సన్తానః కల్పవృక్షశ్చ (పుంసి) వా హరిచన్దనమ్ ౫౦

తకుల పేరులు. మన్దాకినీ, వియద్గఙ్గా, స్వర్నదీ, సురదీర్ఘికా ఈ ౪ ఆకాశగంగ పేరులు. మేరుః, సుమేరుః, హేమాద్రిః, రత్నసానుః, సురాలయః ఈ ౫ మేరుపర్వతము పేరులు. మన్దారః, పారిజాతకః, సన్తానః, కల్పవృక్షః, హరిచన్దనమ్ ఈ ౫ దేవవృక్షము లైదింటికిని పేరులు.

సనత్కుమారో వైధాత్ర స్స్వర్వైద్యావశ్వినీసుతౌ నాసత్యావశ్వినౌ దస్రావాశ్వినేయౌ చ (తావుభౌ) ౫౧

సనత్కుమారః, వైధాత్రః ఈ ౨ బ్రహ్మపుత్రుని పేళ్ళు. స్వర్వైద్యౌ, అశ్వినీసుతౌ, నాసత్యౌ, అశ్వినౌ, దస్రౌ, ఆశ్వినేయౌ ఈ ౬ దేవవైద్యులయిన అశ్వినీదేవతల పేరులు.

(స్త్రియాంబహు) ష్వప్సరస స్స్వర్వేశ్యా ఊర్వశీ ముఖాః ఊర్వశీ మేనకా రమ్భా ఘృతాచీ చ తిలోత్తమా సుకేశీ మఞ్జుఘోషా చ చిత్రరేఖా సురాఙ్గనాః) అ॥ పా॥ హాహా హూహూశ్చైవమా

అప్సరసః, స్వర్వేశ్యాః ఈ ౨ ఊర్వశి మొదలగు వేశ్యల పేళ్ళు. ఊర్వశీ, మేనకా, రంభా, ఘృతాచీ, తిలోత్తమా, సుకేశీ, మంజుఘోషా చిత్రరేఖా మొదలుగాగల దేవవేశ్యలు అ॥ పా॥ గన్ధర్వాః,

ద్యాః) గన్ధర్వా (స్త్రీదివౌకసామ్) ॥౨

(పా॥ గాన్ధర్వాః) ఈ ౧ దేవర బలో హాహా హూహూ మొదలయినవి గాయకుల పేరులు.

అగ్నిర్వైశ్వానరో వహ్ని ర్వీతిహోత్రో ధనంజయః, కృపీటయోనిర్జ్వలనో జాతవేదా స్తనూనపాత్ ॥౩ బర్హిశ్శుష్మా కృష్ణవర్త్మా శోచిష్కేశ ఉషర్బుధః, ఆశ్రయాశో బృహద్భానుః కృశానుః పావకో ఽనలః, ॥౪ రోహితాశ్వో వాయుసఖ శ్శిఖావా నాశుశుక్షణిః. హిరణ్యరేతా హుతభు గ్దహనో హవ్యవాహనః. ॥౫ సప్తార్చి ర్దమునా శ్శుక్ర శ్చిత్రభాను ర్విభావసుః శుచి రప్పిత్త మౌర్వస్తు బాడబో బడబానలః. ॥౬ (వహ్నేర్ద్వయో) ర్జ్వాలకీలా వర్చి ర్హేతి శ్శిఖా (స్త్రియామ్), (త్రిషు) స్ఫులిఙ్గో ఽగ్నికణ స్సన్తాప స్సంజ్వర (స్సమౌ) ॥౭

అగ్నిః, వైశ్వానరః, వహ్నిః. వీతిహోత్రః, ధనంజయః, కృపీటయోనిః, జ్వలనః, జాతవేదాః, తనూనపాత్ బర్హిః, శుష్మా, (పా॥ బర్హిశ్శుష్మా) కృష్ణవర్త్మా, శోచిష్కేశః, ఉషర్బుధః ఆశ్రయాశః, (పా॥ ఆశయాశః) బృహద్భానుః కృశానుః, పావకః, అనలః, రోహితాశ్వః (పా॥ లోహితాశ్వః), వాయుసఖః, శిఖావాన్, ఆశుశుక్షణిః, హిరణ్యరేతాః, హుతభుక్, దహనః, హవ్యవాహనః, సప్తార్చిః, దమునాః, శుక్రః, చిత్రభానుః, విభావసుః, శుచిః, అప్పిత్తమ్ ఈ 3౪ అగ్నిదేవుని పేళ్ళు. ఔర్వః, బాడబః, బడబానలః ఈ 3 బడబాగ్ని పేళ్ళు. జ్వాలః, కీలః, అర్చిః, హేతిః,

శిఖః ఈ ౨గి అగ్నిశిఖల పేర్లు. స్ఫులిఙ్గః, అగ్నికణః, ఈ ౨ మిణుగురుల పేళ్ళు. సన్తాపః, సంజ్వరః ఈ ౨ వేడిమి పేర్లు.

(ఉల్కా- స్యాన్నిర్గత జ్వాలా భూతి ర్భసిత భస్మని, క్షారో రక్షా చ దావస్తు దవో వనహుతాశనః (అధిక పాఠము)

ఉల్కా- ఈ ౧ కొఱవి పేరు. భూతిః, భసితమ్, భస్మ, క్షారః రక్షా ఈ ౫గి బూడిది పేళ్ళు. దావః, దవః ఈ ౨ కారుచిచ్చు పేళ్ళు. అ॥ పా॥

ధర్మరాజః పితృపతిః సమవర్తీ పరేతరాట్, కృతాన్తో యమునాభ్రాతా శమనో యమరాడ్యమః ౧౪గి కాలో దణ్డధర శ్శ్రాద్ధదేవో వైవస్వతోఽన్తకః.

ధర్మరాజః, పితృపతిః, సమవర్తీ, పరేతరాట్, కృతాన్తః, యమునాభ్రాతా, శమనః, యమరాట్, యమః, కాలః, దణ్డధరః, శ్రాద్ధదేవః, వైవస్వతః, అన్తకః ఈ ౧౪గి యముని పేర్లు.

రాక్షసః కౌణపః క్రవ్యాత్ క్రవ్యాదోఽస్రప ఆశరః. ౧౫గి రాత్రించరో రాత్రిచరః కర్బురో నికషాత్మజః, యాతుధానః పుణ్యజనో నైరృతో యాతు రక్షసీ. ౬౦

రాక్షసః, కౌణపః, (పా॥ కౌణవః), క్రవ్యాత్, క్రవ్యాదః, అస్రపః, (పా॥ అస్రవః), ఆశరః, (పా॥ అసురః) రాత్రించరః, రాత్రిచరః, కర్బురః, (పా॥ కర్బరః, నికషాత్మజః, యాతుధానః, పుణ్యజనః, నై

రృతః, యాతు, రక్షః ఈ ౧౫ నైరృతి పేరులు.

ప్రచేతా వరుణః, పాశీ, యాదసాంపతి రప్పతిః.

ప్రచేతాః, వరుణః, పాశీ, యాదసాంపతిః అప్పతిః ఈ ౫ వరుణుని పేరులు.

శ్వసన స్స్పర్శనో వాయు ర్మాతరిశ్వా సదాగతిః ౬౦ పృషదశ్వో గన్ధవహో గన్ధవాహోఽనిలాఽశుగాః, సమీర మారుత మరు జ్జగత్ప్రాణ సమీరణాః ౬౧ నభస్వద్వాత పవన పవమాన ప్రభఞ్జనాః,

శ్వసనః, స్పర్శనః, వాయుః, మాతరిశ్వా, సదాగతిః, పృషదశ్వః, గన్ధవహః, గన్ధవాహః, అనిలః, ఆశుగః, సమీరః, మారుతః, మరుత్, జగత్ప్రాణః సమీరణః నభస్వాన్, వాతః, పవనః, పవమానః, ప్రభఞ్జనః ఈ ౨౦ వాయుదేవుని పేరులు.

## అధికపాఠము.

ప్రకమ్పనో మహావాతో ఝంఝావాత స్సవృష్టికః

ప్రకమ్పనః - మహావాతః - ఝంఝావాతః - సవృష్టికః. ౪ గాలితోఁ గూడిన వర్షముల పేళ్ళు.

ప్రాణోఽపాన స్సమాన శ్చోదానవ్యానౌ చ వాయవః ౬౨ శరీరస్థా ఇమే రంహా స్తరసీతు రయః స్యదః.

ప్రాణః, అపానః, సమానః, ఉదానః, వ్యానః ఈ ౫ శరీరమందుండే అయిదు వాయువుల పేరులు. రంహః, తరః,

రంహః, సద్యః ఈ ౨ వేగముతోఁ గూడిన గమనము పేరులు.

(హృది) ప్రాణో (గుదే) ఽపాన స్సమానో (నాభిసంస్థితః, (ఉదానః కణ్ఠదేశస్థో) వ్యానః (సర్వశరీరగః,) నాగశ్చ కూర్మః కృకరో దేవదత్తో ధనంజయః, (వాగ్వ్యాహారే) నాగ (ఆఖ్యాతః) కూర్మ (ఉన్మీలనస్మృతః), కృకరా (చ్ఛుతం జ్ఞేయం) దేవదత్తా (ద్విజృమ్భణమ్), (నజహాతి మృతం చాపి సర్వవ్యాపీ) ధనంజయః, (అధిక పాఠము.)

ప్రాణః = ప్రాణవాయువు, హృది = హృదయమందుండును, అపానః = అపానవాయువు, గుదే = గుదమునందుండును, సమానః = సమానవాయువు, నాభిసంస్థితః = నాభియందుండును ఉదానః = ఉదానవాయువు, కణ్ఠదేశస్థః = కంఠమునందుండును, వ్యానః = వ్యానవాయువు, సర్వశరీరగః = శరీరమంతటను యుండును. నాగ, కూర్మ, కృకర, దేవదత్త, ధనంజయ, వాయువులు, వాగ్వ్యాహారం, ఆఖ్యాత, ఉన్మీలన, క్షుత, విజృంభణాదులందుండును. అధికపాఠము.

జవోఽథ శీఘ్రం త్వరితం లఘు క్షిప్ర మరం ద్రుతమ్ ౬౮ సత్వరం చపలం తూర్ణ మవిలమ్బిత మాశు చ,

శీఘ్రం, త్వరితం, లఘు, క్షిప్రం, అరం, ద్రుతం సత్వరం, చపలం, తూర్ణం, అవిలమ్బితం, ఆశు ఈ ౧౧ శీఘ్రము పేరులు.

సతతానారతా శ్రాన్త
సన్తతావిరతానిశం। ౬౫
నిత్యానవర తాజస్ర

సతతం, అనారతం, అశ్రాన్తం, సన్తతం, అవిరతం, అనిశం, నిత్యం, అనవరతం, అజస్రం ఈ ౯ ఎడతెగని క్రియకు పేళ్ళు.

మప్యథాతిశయో భరః
అతివేల భృశా త్యర్థాతిమా
త్రోద్గాఢ నిర్భరం। ౬౬
తీవ్రైకాన్తనితాన్తాని గాఢ
బాఢ దృఢానిచ

అతిశయః భరః, అతివేలం, భృశం, అత్యర్థం, అతిమాత్రం. ఉద్గాఢం, నిర్భరం, తీవ్రం, ఏకాన్తం, నితాన్తం గాఢం, బాఢం, దృఢం, ఈ ౧౪ అతిశయమునకు పేరులు.

క్లీబే శీఘ్రాద్యసత్వే స్యా
త్త్రిష్వేషాం సత్వగామియత్

శీఘ్రశబ్దము మొదలు ౨౦ శబ్దములు క్రియావిశేషణము లైనను గుణవాచకము లైనను నపుంసక లింగములును, అతిశయశబ్దము మొదలు ౧౪ శబ్దములు క్రియావిశేషణము లైనపుడు, నపుంసక లింగము లున్ను, గుణవాచకము లయి నపుడు, పుంలింగములున్ను ఈ ౩౪ శబ్దములలో నేశబ్దమైనను విశేష్యముతోఁ గూ

డు నప్పుడు త్రిలింగములు ను అగును.

కుబేర స్త్ర్యంబకసఖో యక్షరాడ్గుహ్యకేశ్వరః మనుష్యధర్మా ధనదో రాజరాజో ధనాధిపః, ౬౮ కిన్నరేశో వైశ్రవణః పౌలస్త్యో నరవాహనః, యక్షైకపిఙ్గ ఐలబిల శ్రీద పుణ్యజనేశ్వరాః. ౬౯

కుబేరః, త్ర్యంబకసఖః, యక్షరాట్, గుహ్యకేశ్వరః, మనుష్యధర్మా, ధనదః, రాజరాజః, ధనాధిపః, కిన్నరేశః, వైశ్రవణః, పౌలస్త్యః, నరవాహనః, యక్షః, ఏకపిఙ్గః, ఐలబిలః, శ్రీదః, పుణ్యజనేశ్వరః ఈ ౧౭ కుబేరుని పేరులు.

(అస్యోద్యానం) చైత్రరథం (పుత్రస్తు) నలకూబరః, కైలాస (స్థాన) మలకా (పూ) (ర్విమానంతు) పుష్పకం ౭౦ స్యాత్కిన్నరః కింపురుష స్తురఙ్గవదనో మయుః నిధి (ర్నా) శేవధి (ర్భేదాః) పద్మశఙ్ఖా దయో (నిధేః) ౭౧ [మహాపద్మశ్చ పద్మశ్చ శఙ్ఖో మకరకచ్ఛపౌ ముకున్దః కున్దనీలాచ ఖర్వశ్చ నిధయో నవ] అ॥ పా॥

చైత్రరథం ఈ ౧ కుబేరుని తోటపేరు. నలకూబరః ఈ ౧ ఇతని కుమారుని పేరు. కైలాసః ఈ ౧ ఇతని నివాసస్థానము పేరు. అలకా ఈ ౧ ఇతని పట్టణము పేరు. పుష్పకం ఈ ౧ ఇతని విమానము పేరు కిన్నరః, కింపురుషః, తురఙ్గవదనః, మయుః ఈ 4 కిన్నరుల పేరులు. (ఇవి వాల్గు జాతులని వాడుటయుఁ గలదు) నిధిః, శేవధిః, (పా॥ సేవధిః) ఈ ౨ నిధి పేళ్ళు, పద్మము,

శంఖము. ఇవి ౯ నవనిధిభేదములు. మహాపద్మః, పద్మః, శంఖః, మకరః, కచ్ఛపః, ముకున్దః, కున్దః, నీలః, ఖర్వః, ఈ ౯ నవనిధులపేరులు.

ఇతి స్వర్గవర్గః.

(స్వర్గముతోఁ జేరిన పద సమూహము ముగిసెను.)

ద్యోదివౌ (ద్వేస్త్రియాం) అభ్రం వ్యోమ పుష్కర మమ్బరమ్, నభోఽన్తరిక్షం గగన మనన్తం సురవర్త్మ ఖమ్ ౨౨ వియ ద్విష్ణుపదం (వాతుపుం) స్యాకాశ విహాయసీ [విహాయసోఽపి నాకోఽపి ద్యురపి స్యాత్తదవ్యయమ్ తారాపథ శ్శబ్దగుణో మేఘద్వారం మహాబిలం].

ద్యౌః, దివౌ, అభ్రం, వ్యోమ, పుష్కరం, అమ్బరం, నభః, అన్తరిక్షం, గగనం అనన్తం, సురవర్త్మ, ఖం, వియత్, విష్ణుపదం, ఆకాశం, విహాయాః, ఈ ౧౬ ఆకాశముపేరులు. విహాయసః నాకః ద్యుః, తారాపథః, శబ్దగుణః, మేఘద్వారం, మహాబిలం.

ఇతి వ్యోమవర్గః.

(ఆకాశముతోఁ జేరిన పద సమూహము ముగిసెను.)

దిశస్తు కకుభః కాష్ఠా ఆశాశ్చ హరితశ్చ (తాః) ౨౩

దిక్, కకుభః, కాష్ఠా, ఆశా, హరితః, ఈ ౫ దిక్సామాన్య నామములు.

ప్రాచ్యవాచీ ప్రతీచ్య (స్తాః పూర్వ దక్షిణ పశ్చిమాః) (ఉత్తరాది) గుదీచి

ప్రాచీ, అవాచీ (ప్రా॥ ప్రతీచీ, ఉదీచీ, ఈ ౪ వరుసగా తూర్పు, దక్షిణ, పడమర, ఉత్తర దిక్కుల పేర్లు.

(స్యాత్) దిశ్యం తు (త్రిషుదిగ్భవే) ౭౪ (అవాగ్భవ) మవాచీన ముదీచీన (ముదగ్భవమ్), (ప్రత్యగ్భవం) ప్రతీచీనం ప్రాచీనం (ప్రాగ్భవం త్రిషు) అధికపాఠము.

దిశ్యం = ఈ ౧ దిక్కులయందుం బుట్టిన వస్తువు పేరు. అవాచీనం = దక్షిణ దిక్కునం బుట్టినది. ఉదీచీనం = ఉత్తర దిక్కున బుట్టినది. ప్రతీచీనం = పడమర దిక్కున బుట్టినది. ప్రాచీనం = తూర్పు దిక్కునం బుట్టినది.

ఇన్ద్రో వహ్నిః పితృపతి ర్నైరృతో వరుణో మరుత్, కుబేర ఈశః (పతయః పూర్వాదీనాం దిశాం క్రమాత్.) ౭౫

ఇన్ద్రః, వహ్నిః, పితృపతిః, నైరృతిః, వరుణః మరుత్, కుబేరః, ఈశః ఈ ౮ క్రమాత్ = క్రమముగా, పూర్వాదీనామ్ = తూర్పు మొదలైన, దిశాం = ఎనిమిది దిక్కులకు, పతయః = అధిపతుల పేరులు.

ఐరావతః పుణ్డరీకో వామనః కుముదో ఽఞ్జనః పుష్పదన్త స్సార్వభౌమ స్సుప్రతీక(శ్చ

ఐరావతః పుణ్డరీకో వామనః కుముదః, అఞ్జనః పుష్పదన్తః, సార్వభౌమః, సుప్రతీ

దిగ్గజాః) ౧౬ కరిణ్యోఽభ్రముః కపిలా పిఙ్గలాఽనుపమా క్రమాత్, తామ్రకర్ణీ శుభ్రదన్తీ చాఙ్గనా చాఞ్జనావతీ.

కః ఈ ౮ వరుసగా ఎనిమిది దిగ్గజముల పేరులు.

అభ్రముః, కపిలా, పిఙ్గలా, అనుపమా, తామ్రకర్ణీ, (పా॥ తామ్రకర్ణీ.) శుభ్రదన్తీ, అఙ్గనా, అఞ్జనావతీ ఈ ౮ క్రమాత్ = క్రమముగా, కరిణ్యః = దిగ్గజముల భార్యల పేరులు.

(క్లీబేవ్యయన్త్వ) పదిశం దిశోర్మధ్యే విదిక్ (స్త్రియామ్), అభ్యన్తరం త్వన్తరాళం చక్రవాళంతు మణ్డలమ్ ౧౭

అపదిశం, విదిక్. ఈ ౨ దిశోర్మధ్యే = రెండుదిక్కుల నడుమనుండెడు మూలదిక్కు పేర్లు. అభ్యన్తరం, అన్తరాళం ఈ ౨ మధ్యప్రదేశము పేళ్ళు. చక్రవాళం, మణ్డలం ఈ ౨ మండలాకారమైన వస్తువు పేర్లు.

అభ్రం మేఘో వారివాహః స్తనయిత్నుర్వలాహకః, ధారాధరో జలధర స్తటిత్వాన్వారిదోఽమ్బుభృత్. ౧౮ ఘన జీమూత ముదిర జలము గ్ధూమయోనయః.

అభ్రం, మేఘః, వారివాహః, స్తనయిత్నుః, వలాహకః, (పా॥ బలాహకః,) ధారాధరః, జలధరః, తటిత్వాన్, వారిదః, అమ్బుభృత్, ఘనః, జీమూతః, ముదిరః, జలముక్,

ధూమయోనిః ఈ ౧౯ మేఘము పేరులు.

కాదమ్బినీ మేఘమాలా (త్రిషు మేఘభవే) ఽభ్రియమ్ ౬౦.
స్తనితం, గర్జితం (మేఘనిర్ఘోషో) రసితాదిచ, శమ్పా శతహ్రదా హ్రాదిన్యైరావత్యః క్షణప్రభా తటిత్సౌదామనీ విద్యుచ్చఞ్చలా చపలాపి చ స్ఫూర్జథుర్వజ్రనిర్ఘోషో మేఘజ్యోతి రిరమ్మదః ౬౨
ఇన్ద్రాయుధం శక్రధను స్తదేవ (ఋజు) రోహితమ్, వృష్టి ర్వర్షం (తద్విఘాతే) ఽవగ్రహో ఽవగ్రహా (సమా) ౬౪
ధారా సంపాత ఆసార శ్శీకరో ఽమ్బుకణాః (స్మృతాః) వర్షోపలస్తు కరకా మేఘచ్ఛన్నే ఽహ్ని) దుర్దినం. ౬౬

కాదమ్బినీ, మేఘమాలా, ఈ ౨ మేఘపంక్తి పేళ్ళు. అభ్రియం ఈ ౧ మేఘభవే=మేఘమునందు పుట్టిన జలాదుల పేరు. స్తనితం, గర్జితం, రసితం ఈ ౩ మేఘనిర్ఘోష=ఉరుము పేళ్ళు ఆదిశబ్దము వలన స్వానితధ్వనితాదులను పేరులు కలవు శంపా, (పా॥ సంపా), శతహ్రదా, హ్రాదినీ, ఐరావతీ, క్షణప్రభా, తటిత్, సౌదామనీ, (పా॥ సౌదామినీ,) విద్యుత్, చఞ్చలా, చపలా ఈ ౧౦ మెఱుపు పేరులు స్ఫూర్జథుః వజ్రనిర్ఘోషః (పా॥ వజ్రనిష్పేషః), ఈ ౨ వజ్రఘట్టనము వల్ల కలిగిన మ్రోత పేరులు. మేఘజ్యోతిః, ఇరమ్మదః ఈ ౨ మేఘమునందున్న తేజము పేళ్లు ఇన్ద్రాయుధం, శక్రధనుః ఈ

రోహితం ౧ ఋజు=చక్కగా నున్న యింద్రధనుస్సు పేరు. వృష్టిః, వర్షం ఈ ౨ వాన పేళ్ళు. వగ్రహః, అవగ్రహః ఈ ౨ తత్ప్రతిఘాతే=వర్షమునకు విఘ్నము గల్గుట (అనావృష్టి పేరులు) ధారాసంపాతః, ఆసారః ఈ ౨ జడివాన పేరులు శీకరః, అంబుకణాః ఈ ౨ తుంపురుల పేరులు వర్షోపలః, కరకః, (పా॥ కరకా) ఈ ౨ వడగండ్ల పేరులు దుర్దినం ఈ ౧ మేఘచ్ఛన్నే=మేఘములచే గప్పబడిన అహ్ని=దినము పేరు.

అన్తర్ధా వ్యవధా (పుంసి)
త్వన్తర్ధి రపవారణం, అపి
ధాన తిరోధాన పిధానాచ్ఛా
దనాని చ. ౧౨౯

అన్తర్ధా, వ్యవధా, అన్తర్ధిః అపవారణం, అపిధానం, తిరోధానం, పిధానం, ఆచ్ఛాదనం ఈ ౮ కప్పుట పేళ్ళు

హిమాంశు శ్చన్ద్రమా శ్చ
న్ద్ర ఇన్దుః కుముదబాన్ధవః
విధు స్సుధాంశు శ్శుభ్రాంశు
రోషధీశో నిశాపతిః. ౧౩౦
అబ్జో జైవాతృక స్సోమో గ్లౌ

హిమాంశుః, చన్ద్రమాః, చన్ద్రః, ఇన్దుః కుముదబాన్ధవః, విధుః, సుధాంశుః, శుభ్రాంశుః, ఓషధీశః, నిశాపతిః అబ్జః, జైవాతృకః,

మృగాఙ్కః కలానిధి ర్ద్విజరాజ శ్శశధరో నక్షత్రేశః క్షపాకరః. ౧౭

సోమః, గ్లౌః, మృగాఙ్కః కలానిధిః, ద్విజరాజః, శశధరః, నక్షత్రేశః, క్షపాకరః ఈ ౨౦ చంద్రుని పేరులు.

కలాతు (షోడశో భాగో) బిమ్బో (ఽస్త్రీ) మణ్డలం (త్రిషు)

కలా, ౧ చంద్రుని పదునాఱవ పాలు పేరు. బిమ్బః, మణ్డలం, ఈ ౨ చంద్ర సూర్య మండలముల పేళ్ళు.

భిత్తం శకలఖణ్డే (వాపుంస్య) ర్ధోర్ధం (సమేంశకే). ౧౮ చన్ద్రికా కౌముదీ జ్యోత్స్నా ప్రసాదస్తు ప్రసన్నతా, కళఙ్కాఙ్కౌ లాఞ్ఛనంచ చిహ్నం లక్ష్మచ లక్షణం. ౧౯ [పాళిః కేతు ర్ధ్వజో లిఙ్గం నిమిత్తం వ్యఞ్జనం పదం, ప్రజ్ఞానం చాప్యభిజ్ఞానం లలామంచ లలామచ] అధికపాఠము.

భిత్తం, శకలం, ఖణ్డః, అర్ధః ఈ ౪ తునకకుం బేళ్ళు. చన్ద్రికా, కౌముదీ జ్యోత్స్నా ఈ 3 వెన్నెలకు పు. ప్రసాద, ప్రసన్నతా ఈ ౨ నిర్మలత్వమునకును, కళఙ్కః, అఙ్కః, లాఞ్ఛనం, చిహ్నం, లక్ష్మ, లక్షణం ఈ ౬ గుఱుతునకుం బేళ్ళు. పాళిః, కేతుః, ధ్వజః, లిఙ్గం, నిమిత్తం వ్యఞ్జనం, పదం, ప్రజ్ఞానం, అభిజ్ఞానం లలామం లలామ, అ॥ పా॥

సుషమా (పరమా శోభా) శోభా కాన్తి ర్ద్యుతి శ్ఛ

సుషమా, ౧ పరమా – ఎక్కువైన, శోభా, కాంతిః

వి:, అవశ్యాయస్తు నీహార
స్తుషారస్తుహినం హిమం ౯౦
ప్రాలేయం మిహికా చాథ
హిమానీ (హిమ సంహతిః)
శీతం (గుణే తద్వదర్థా స్సు
షీమశ్శిశిరో జడః ౯౧ తుషా
ర శ్శీతల శ్శీతో హిమ (స్సప్తా
న్య లిఙ్గకాః), ధ్రువ ఔత్తా
నపద (స్స్యాత్) దగ స్త్యః
కుమ్భసమ్భవః ౯౨ మైత్రా
వరుణి(ర స్యైవ) లోపాముద్రా
(సధర్మిణీ) నక్షత్ర మృక్షం
భం తారా తారకాప్యుడు వా
(స్త్రియాం) ౯౩ దాక్షా
య ణ్యో (ఽశ్వినీత్యాదితా
రా) అశ్వ యుగశ్వినీ రాధా
విశాఖా పుష్యే తుసిధ్యతిష్యౌ
శ్రవిష్ఠయా ౯౪ (సమా)
ధనిష్ఠా (స్స్యుః) ప్రోష్ఠపదా
భాద్రపదాః (స్త్రియః)' మృ
గశీర్షే మృగశిర (స్తస్మి
న్నేవా) ఽగ్రహాయణీ ౯౫
ఇల్వలా (స్తచ్ఛిరోదేశే తార
కా నివస న్తియాః.)

పేరు శోభా, కాన్తిః, ద్యు
తిః, ఛవిః, ఈ ౪ కాంతికి
పేరులు. అవశ్యాయః, నీహా
రః, తుషారః, తుహినః,
హిమం, ప్రాలేయం, మి
హికా, (పా॥ మహికా), ఈ
౭ మంచుపేళ్ళు హిమానీ
౧ హిమసంహతిః = మంచు
సమూహము పేరు. శీతం,
గుణవాచక మైనపుడు శైత్య
గుణముపేరు. సుషీమః, (పా॥
సుశీమః), శిశిరః, జడః, తు
షారః, శీతలః, శీతః, హిమః,
ఈ ౭ శైత్యగుణముగల వస్తు
వుపేళ్ళు. ఇవి విశేష్యలింగ
ములు. ధ్రువః, ఔత్తానపా
దిః, ఈ ౨ ధ్రువుని పేళ్ళు.
అగస్త్యః, కుమ్భసమ్భవః,
మైత్రావరుణిః ఈ 3 అగ
స్త్యుని పేళ్ళు లోపాముద్రా,
ఈ ౧ అగస్త్యుని భార్యపేరు.
నక్షత్రం, ఋక్షం, భం,
తారా, తారకా, ఉడు, ఈ
౬ నక్షత్రము పేరులు. అశ్వినీ

త్వ్యాది తారాః = అశ్విని
నక్షత్రము మొదలు యిరు
వదియేడు నక్షత్రములు, దా
క్షాయిణ్యః = దాక్షాయిణు
లనఁబడును. అశ్వయుక్, అ
శ్వినీ, ఈ ౨ అశ్వినీ నక్షత్ర
ము పేరులు. రాధా, విశాఖా,
ఈ ౨ విశాఖా నక్షత్రము
పేళ్ళు పుష్యః, సిధ్యః, తి
ష్యః, ఈ ౩ పుష్యమి నక్ష
త్రము పేరులు శ్రవిష్ఠా,
ధనిష్ఠాః, యీ ౨ ధనిష్ఠ
పేళ్ళు. ప్రోష్ఠపదాః, ఈ ౧
పూర్వాభాద్ర పేరు భాద్ర
పదాః, ఈ ఒకటి ఉత్తరా
భాద్రపేరు మృగశీర్షం మృగ
శిరః, ఆగ్రహాయణీ ఈ ౩
మృగశీర్ష పేళ్ళు. ఇల్వలాః
ఈ ౧ తచ్ఛిరోదేశే = ఆ
మృగశీర్ష నక్షత్రములగూఁడ
దగాః తారాకాః నివసన్తి =
ఏ నక్షత్రము లున్నవో వాని
పేళ్ళు.

బృహస్పతి స్సురాచార్యో
గీష్పతి ర్ధిషణో గురుః ౯౬
జీవ ఆఙ్గీరసో వాచస్పతి శ్చిత్ర
శిఖణ్డిజః శుక్రో దైత్య
గురుః, కావ్య ఉశనా
భార్గవః కవిః ౯౭ అఙ్గారకః
కుజో భౌమో లోహితాఙ్గో
మహీ సుతః, రౌహిణేయో
బుధ స్సౌమ్య (స్సమౌ) సౌరి
శనైశ్చరౌ. ౯౮ అ॥ పా॥
[శనిమన్దౌ పఙ్గుకాలౌ ఛాయా
పుత్రో ౽ సితో ౽ర్కజః
తమస్తు రాహు స్స్వర్భాను
స్సైంహికేయో విధుంతుదః
(సప్తర్షయో మరీచ్యత్రిము
ఖాశ్చిత్ర శిఖణ్డినః ౯౯ (రాశీ
నాము దయో) లగ్నం (తేతు
మేష వృషాదయః)

బృహస్పతిః, సురాచా
ర్యః, గీష్పతిః, ధిషణః, గురుః
జీవః, అఙ్గీరసః, వాచస్పతిః,
చిత్రశిఖణ్డిజః ఈ ౯ బృహ
స్పతి పేరులు. శుక్రః, దైత్య
గురుః, కావ్యః, ఉశనాః,
భార్గవః, కవిః ఈ ౬ శుక్రుని
పేళ్ళు. అఙ్గారకః, కుజః,
భౌమః లోహితాఙ్గః, మహీ
సుతః ఈ ౫ అంగారకుని
పేళ్లు రౌహిణేయః, బుధః,
సౌమ్యః, ఈ 3 బుధుని పేళ్ళు.
సౌరిః శనైశ్చరః ఈ ౨ శని
పేళ్ళు శనిః మందః పఙ్గుః,
కాలః, ఛాయాపుత్రః, అశితః,
అర్కజః. (అ॥ పా॥) తమః,
రాహుః, స్వర్భానుః, సైంహి
కేయః, విధుంతుదః, ఈ ౫
రాహువు పేళ్ళు. మరీచ్యత్రి
ముఖాః=మరీచి, అత్రి (అంగి
రసుడు, పులస్త్యుఁడు, పుల
హుఁడు, క్రతువు, వశిష్ఠుఁడు)
మొదలైన సప్తర్షయః = సప్త
ఋషులు, చిత్రశిఖణ్డినః, చిత్ర

శీఘ్రోదయములనబడుదురు. లగ్నం ఈ ౧౨ రాసుల ఉదయము పేరు. మేషము, వృషభము, మిథునము, కర్కాటకము, సింహము, కన్య, తుల, వృశ్చికము, ధనుస్సు, మకరము, కుంభము, మీనము అను పండ్రెండు రాసులు.

సూర సూర్యార్యమాదిత్య ద్వాదశాత్మ దివాకరాః ౧౦౦ భాస్కరాహస్కర బ్రధ్న ప్రభాకర విభాకరాః భాస్వద్వివస్వత్సప్తాశ్వ హరిదశ్వోష్ణరశ్మయః, ౧౦౧ వికర్తనార్క మార్తాండ మిహిరారుణ పూషణః ద్యుమణి స్తరణి ర్మిత్ర శ్చిత్రభాను ర్విరోచనః ౧౦౨ విభావసు ర్గ్రహపతి స్త్విషాంపతి రహర్పతిః, భాను ర్హంస స్సహస్రాంశు స్తపన స్సవితా రవిః.

సూరః, (పా॥ శూరః,) సూర్యః, అర్యమా, ఆదిత్యః, ద్వాదశాత్మా, దివాకరః, భాస్కరః, అహస్కరః, బ్రధ్నః, ప్రభాకరః, విభాకరః, భాస్వాన్, వివస్వాన్, సప్తాశ్వః, హరిదశ్వః, ఉష్ణరశ్మిః, వికర్తనః, అర్కః, మార్తాండః, పా॥ మార్తాండః మిహిరః, అరుణః, పూషా, ద్యుమణిః, తరణిః, మిత్రః, చిత్రభానుః, విరోచనః, విభావసుః, గ్రహపతిః, త్విషాంపతిః, అహర్పతిః, భానుః, హంసః, సహస్రాంశుః తపనః, సవితా, రవిః ఈ 37 సూర్యుని పేళ్ళు.

[కర్మసాక్షి జగచ్చక్షు రంశుమాలీ త్రయీతనుః, ప్రద్యోతనో దినమణిః ఖద్యోతో లోకబాంధవః ఇనో భగో ధామనిధిశ్చ పద్మినీవల్లభో హరిః] అధికపాఠము.

కర్మసాక్షీ, జగచ్చక్షుః, అంశుమాలీ, త్రయీతనుః, ప్రద్యోతనః, దినమణిః, ఖద్యోతః, లోకబాంధవః, ఇనః, భగః, ధామనిధిః, పద్మినీవల్లభః, హరిః, అ॥ పా॥

## అధికపాఠము.

శ్లో. తద్వాంస్తు స్తేజసాం రాశిశ్ఛాయానాథ స్తమిస్రహా॥

మాఠరః, పిఙ్గలో దణ్డ (శ్చణ్డాంశోః, పారిపార్శ్వకాః) సూరసూతో ఽరుణో ఽనూరుః కాశ్యపి ర్గరుడాగ్రజః ౧౦౪ పరివేషస్తు పరిధి రుపసూర్యక మణ్డలే కిరణో ఽస్ర మయూఖాంశు గభస్తి ఘృణి ధృష్ణయః. ౧౦౪ భానుః కరో మరీచిః (స్త్రీపుంసయోః) దీధితిః (స్త్రియాం) (స్యుః) ప్రభా రుగ్రుచి స్త్విడ్భా భాశ్ఛవిద్యుతి దీప్తయః. ౧౦౬ రోచిశ్శోచి (రుభే క్లీబే) ప్రకాశో ద్యోత ఆతపః కోష్ణం కవో

మాఠరః, పిఙ్గళః, దణ్డః, ఈ 3 చణ్డాంశోః = సూర్యుని యొక్క, పారిపార్శ్వకాః, = పార్శ్వమున నుండుడు ముగ్గురు విష్ణుదేవతల పేళ్లు. సూరసూతః, అరుణః, అనూరుః, కాశ్యపిః, గరుడాగ్రజః, ఈ ౫ సూర్యసారథి పేరులు. పరివేషః, (పా॥ పరివేశః,) పరిధిః, ఈ ౨ను సూర్యపరివేషము పేరులు ఉపసూర్యకం, మండలం, ఈ ౨ ప్రతి సూర్యుని పేళ్ళు. (పరివేషశబ్దము మొదలు ఈ ౪ ఒకా

ష్ణం మన్దోష్ణం కదుష్ణం (త్రిషు తద్వతి) ౧౦౭ తిగ్మం తీక్ష్ణం ఖరం (తద్వ) న్మృగతృష్ణా మరీచికా.

నేర్పడు సూర్యుని చుట్టును కనబడు గుండలాకారమైన తేజోవిశేషము పేళ్ళని కొంద రందురు. కిరణః, ఉస్రః, మయూఖః, అంశుః, గభస్తిః, ఘృణిః, ధృష్టిః పా॥ వృష్టిః భానుః, కరః, మరీచిః, దీధితిః ఈ ౧౨ సూర్యకిరణముల పేళ్లు. ప్రభా, రుక్, రుచిః, త్విట్, భాః, భా, ఛవిః, ద్యుతిః, దీప్తిః, రోచిః, శోచిః, ఈ ౧౧ సూర్యకాంతి పేరులు. ప్రకాశః, ద్యోతః, ఆతపః ఈ 3 ఎండపేళ్ళు కోష్ణం కవోష్ణం మన్దోష్ణం, కదుష్ణం ఈ ౪ ఇంచుక వేడిమి పేళ్లు తిగ్మం, తీక్ష్ణం, ఖరం, ఈ 3 వేడిమి పేళ్లు. మృగతృష్ణా, మరీచికా ఈ ౨ ఎండమావుల పేళ్లు.

ఇతి దిగ్వర్గః

దిక్కులతో చేరిన పద సమూహము ముగిసెను.

## కాలవర్గము.

కాలో దిష్టోఽప్యనేహాఽపి సమయోఽప్యథ పక్షతిః

కాలః దిష్టః, అనేహా, సమయః ఈ ౪ కాలము పేళ్లు.

౧౦౮ ప్రతిపద్ద్వే ఇమే స్త్రీ
త్వే (తదాద్యాః) తిథయో
(ద్వయోః) ఘస్రో దినాహనీ
(వాతు) క్లీబే దివస వాసరౌ
౧౦౯ ప్రత్యూషో ఒహర్ముఖం
కల్య ముషః ప్రత్యూషసీ
అపి, ప్రభాతంచ దినాన్తేతు
సాయం సన్ధ్యా పితృప్రసూః
౧౧౦

ప్రతిపత్, ప్రతిపత్ ఈ ౨ పాడ్యమి మొదలైన తిథులపేర్లు ఘస్రః, దినం, అహః, దివసః, వాసరః ఈ ౫ దినము పేర్లు. ప్రత్యూషః, అహర్ముఖం, కల్యం, ఉషః, ప్రత్యూషః, ప్రభాతం ఈ ౬ ప్రాతఃకాలము పేళ్ళు. దినాన్తః సాయః పా॥ సాయం ఈ ౨ సాయంకాలము పేళ్లు, సంధ్యా, పితృప్రసూః ఈ ౨ సంధ్యాకాలము పేర్లు.

## అధికపాఠము.

శ్లో॥ వ్యుష్టం విభాతం ద్వేక్లీబే పుంసి గోసర్గ ఇష్యతే.

(ప్రాహ్ణాపరాహ్ణ మధ్యాహ్నాః) త్రిసన్ధ్య (మధ)

త్రిసన్ధ్యమ్ ఈ ప్రాహ్ణాపరాహ్ణమధ్యాహ్నములనబడు దినముయొక్క ఆద్యంతమధ్యభాగముల సమూహమునకు పేరు.

శర్వరీ నిశా నిశీథినీ రాత్రి
స్త్రియామా క్షణదా క్షపా.
౧౧౧

శర్వరీ, నిశా, నిశీథినీ, రాత్రిః, త్రియామా, క్షణదా, క్షపా.

| | |
|---|---|
| విభావరీ తమస్విన్యౌ రజనీ యామినీ తమీ, తమిస్రా (తామసీ రాత్రి) | విభావరీ, తమస్వినీ, రజనీ పా॥ రజనిః, యామినీ, తమీ, పా॥ తమీ ఈ ౧౨ రాత్రి పేళ్లు. తమిస్రా ఈ ౧ తామసీ రాత్రిః = గాఢాంధకారము గల రాత్రి పేరు. |
| జ్యోత్స్నీ చన్ద్రికయాఽన్వితా, | జ్యోత్స్నీ ఈ ౧ చన్ద్రికయా=వెన్నెలతో, అన్వితా=కూడిన రాత్రిపేరు. |
| (ఆగామి వర్తమానా హర్యుక్తాయాం నిశి) పక్షిణీ | పక్షిణీ ఈ ౧ ఆగామివర్తమానా హర్యుక్తాయామ్ నిశి=వచ్చే పగటితోనున్నూ నడిచేపగటితోనున్నూ గూడిన రాత్రిపేరు. |
| గణరాత్రం(నిశా-బహ్వ్యః) ప్రదోషో రజనీముఖమ్ ౧౧౩ | గణరాత్రమ్ ఈ ౧ నిశాః, బహ్వ్యః=అనేక రాత్రుల పేరు. ప్రదోషః, రజనిముఖం ఈ ౨ ప్రదోషకాలము పేళ్ళు. |
| అర్ధరాత్ర నిశీథౌ (ద్వౌ) (ద్వౌ) యామ ప్రహరౌ | అర్ధరాత్రః, నిశీథః ఈ ౨ అర్ధరాత్రము పేళ్ళు. యామః, ప్రహరః ఈ ౨ జాము పేళ్లు. |

(సమా), (స) పర్వసన్ధిః (ప్రతిపత్పఞ్చదశ్యోర్యదన్తరమ్)

పర్వసన్ధిః ఈ ౧ పాడ్యమి పున్నమలకును, పాడ్యమి అమావాస్యలకును మధ్యమునున్న కాలము పేరు.

పక్షాన్తౌ పఞ్చదశ్యౌ (ద్వే)

పక్షాన్తః, పఞ్చదశీ ఈ ౨ పున్నమకును అమావాస్యకును పేరులు.

పౌర్ణమాసీతు పూర్ణిమా (కలాహీనేసా) ౭ నుమతిః (పూర్ణేరాకానిశాకరే) ౧౧౫

పౌర్ణమాసీ, పూర్ణిమా ఈ ౨ పున్నమ పేర్లు. నిశాకరే=చంద్రుడు, కలాహీనే (సతి)=ఒకకళచే దక్కువైన వాడుగా నున్నప్పుడు, సా=ఆపున్నమ, అనుమతిః=అనుమతి అనంబడుచున్నది, పూర్ణే (సతి)=పదారు కళలతోc గూడి యున్నప్పుడు, రాకా=రాక యనంబడును.

అమావాస్యా త్వమావస్యా దర్శస్సూర్యేన్దు సంగమః, (సాదృష్టేన్దు) స్సినీవాలీ సానష్టేన్దుః కలా కుహూః ౧౧౬

అమావాస్యా, అమావస్యా దర్శః, సూర్యేన్దు సఙ్గమః ఈ ౪ అమావాస్య పేళ్ళు. సినీవాలీ ఈ ౧ దృష్టేన్దుః, సా=చంద్రకళ కనుపించిన అమా

| | |
|---|---|
| | నాస్యపేరు. కుహూః ఈ ౧ నష్టేన్దుకలా సా=చంద్రకళ కనుపించని అమావాస్యపేరు. |
| ఉపరాగో గ్రహః | ఉపరాగః, గ్రహః ఈ ౨ గ్రహణము పేర్లు. |
| రాహుగ్రస్తే త్విన్దౌ చ (పూష్ణి చ) సోపప్లవోపరక్తౌ (ద్వౌ) | సోపప్లవః, ఉపరక్తః ఈ ౨ రాహుగ్రస్తే = రాహువుగ్రహింపబడిన, ఇన్దౌ = చంద్రునికి, పూష్ణి చ=సూర్యునికి పేర్లు. |
| అగ్న్యుత్పాత ఉపాహితః. ౧౧౭ | అగ్న్యుత్పాతః; ఉపాహితః ఈ ౨ ధూమకేతువు పేర్లు. |
| (ఏకయోక్త్యా) పుష్పవన్తౌ (దివాకర నిశాకరౌ) | పుష్పవన్తౌ, పు॥ పుష్పవన్తౌ ఈ ౧ ఏకయోక్త్యా= ఒకమాటచేత, దివాకరనిశాకరౌ=సూర్యచంద్రుల పేరు. |
| అష్టాదశ నిమేషాస్తు కాష్ఠా | కాష్ఠా ఈ ౧ అష్టాదశ నిమేషాః=పదునెనిమిది రెప్పపాట్లకాలము పేరు. |
| త్రింశత్తు తాః కలా ౧౧౮ | కలా ఈ ౧ తాః త్రింశత్ = అట్టికాష్ఠలు ముప్పది గూడిన కాలము పేరు. |

(తాస్తు త్రింశత్) క్షణః

క్షణః ఈ ౧ తాః త్రింశత్ =అట్టిక్షణములు ముప్పదిగూడిన కాలము పేరు.

స్తేతు ముహూర్తో (ద్వాదశా స్త్రియామ్)

ముహూర్తః ఈ ౧ తే ద్వాదశ = అట్టిక్షణములు పండ్రెండుగూడిన కాలము పేరు.

(తేతు త్రింశత్) దహోరాత్రః

అహోరాత్రః ఈ ౧ తే త్రింశత్ అట్టిముహూర్తములు ముప్పదిగూడిన కాలము పేరు.

పక్ష (స్తే) దశ పఞ్చచ. ౧౧౯

పక్షః, తే దశపఞ్చ=అట్టి అహోరాత్రములు పదునేను గూడిన కాలము పేరు.

(పక్షౌ పూర్వపరౌ) శుక్లకృష్ణౌ

శుక్లః ౧ కృష్ణః ౧ వరుసగా పూర్వపక్షమునకును అపరపక్షమునకును పేరులు.

మాసస్తు (తావుభౌ),

మాసః ఈ ౧ తావుభౌ= ఆశుక్లకృష్ణపక్షములు రెండు గూడిన కాలము పేరు.

(ద్వౌద్వౌ మాఘాదిమాసౌ స్యాత్) దృతు

ఋతుః మాఘాదిమాసములు రెండేసి నెలలు కూడిన కాలము పేరు.

(తైః) రయనం (త్రిభిః). ౧౨౦

అయనం ఈ ౧ తైః త్రిభిః = అట్టి ఋతువులుమూండు గూడినకాలము పేరు.

(అయనే ద్వే గతి రుదగ్దక్షిణార్కస్య వత్సరః

వత్సరః ఈ ౧ మాఘమాసము మొదలు శ్రావణమాసపర్యంతము సూర్యునియొక్క ఉత్తరగతి ఉత్తరాయణము. శ్రావణము మొదలు మాఘమాస పర్యంతము సూర్యునియొక్క దక్షిణగతి దక్షిణాయనము అట్టి రెండయనములు గూడిన సంవత్సరము పేరు.

సమరాత్రందివే కాలే విషువద్విషువం (చతత్) ౧౨౧

విషువత్, విషువం ఈ ౨ రాత్రియును పగలును సమమైన కాలము పేరులు.

పుష్యయుక్తా పౌర్ణమాసీ పౌషీ.

పౌషీ ఈ ౧ పుష్యయుక్తా=పుష్యనక్షత్రముతో గూడిన, పౌర్ణమాసీ=పున్నమ పేరు.

(మాసేతు యత్ర సా, నామ్నా స) పౌషో (మాఘాద్యాశ్చైవ మేకాదశాపరే) ౧౨౨

పౌషః ఈ ౧ ఏమాసమునందు పున్నమవచ్చునో ఆమాసము పౌషమను పేరు మాఘము మొదలు పదకొండును ఇట్లే తెలియవలయును.

మార్గశీర్షే సహా మార్గ ఆగ్రహాయణిక (శ్చసః).

మార్గశీర్షః, సహాః, మార్గః, ఆగ్రహాయణికః ఈ ౪ మార్గశీర్షము పేర్లు.

పౌషే తైష సహా స్యౌ (ద్వౌ)
తపా మాఘేఽథ
ఫాల్గునే. ౨౨3 (స్యాత్)
తపస్యః ఫాల్గునిక
(స్స్యాత్) చైత్రే చైత్రికో మధుః.
వైశాఖో మాధవో రాధో

పౌషః, తైషః, సహాస్యః ఈ 3 పుష్యమాసము పేరులు.

ఫాల్గునః, తపస్యః, ఫాల్గునికః ఈ 3 ఫాల్గుణమాసము పేరులు.

చైత్రః, చైత్రికః, మధుః ఈ 3 చైత్రమాసము పేరులు.

వైశాఖః, మాధవః, రాధః, ఈ 3 వైశాఖమాసము పేరులు.

జ్యేష్ఠే శుక్ర

జ్యేష్ఠః, శుక్రః, ఈ 2 జ్యేష్ఠమాసము పేరులు.

శ్శుచి (స్త్వయం). ౨౨౮
ఆషాఢే

శుచిః, ఆషాఢః, పా॥ ఆషాఢః ఈ 3 ఆషాఢమాసమునకు బేరులు

శ్రావణే (తు స్యాత్) న్న భా
శ్శ్రావణిక (శ్చ సః)

శ్రావణః, నభాః, శ్రావణికః ఈ 3 శ్రావణమాసమునకు బేరులు.

(స్యు) ర్నభస్యాః ప్రోష్ఠ
పద భాద్ర భాద్రపదాస్సమాః
౨౨౯

నభస్యః, ప్రోష్ఠపదః, భాద్రః, భాద్రపదః ఈ 4 భాద్రపదమాసమునకు బేరులు.

(స్యా) దాశ్వినే ఇషోఽ
ప్యాశ్వయుజోఽపి.

ఆశ్వినః, ఇషః, ఆశ్వయుజః ఈ 3 ఆశ్వయుజ మాసమునకు బేరులు.

సంవత్సరో వత్సరోఽబ్దో
హాయనోఽ(స్త్రీ) శరత్సమాః
(మాసేన స్యా దహోరాత్రః
పైత్రో వర్షేణ దైవతః) ౧౨౯
(దివ్యై ర్వర్ష సహస్రై)
ర్ద్వాదశభి ర్దైవతం యుగం)

సంవత్సరః, వత్సరః, అబ్దః, హాయనః, శరత్, సమాః, ఈ ౬ సంవత్సరము పేరులు. మనుష్యులయొక్క ఒకమాసము చేత పితృదేవతలకు నొక అహోరాత్రము. అందులో శుక్లపక్షము పగలు, కృష్ణపక్షము రాత్రి. మనుష్యులయొక్క ఒక సంవత్సరము దేవతలకు నొక అహోరాత్రము. అందు ఉత్తరాయణము పగలు దక్షిణాయనము రాత్రి. అట్టి మనుష్యుల మున్నూటఱువది యహోరాత్రములు దేవతలకు నొక సంవత్సరము. అటువంటి పండ్రెండు వేల సంవత్సరములు దేవతలకు నొక యుగము. అటువంటి రెండు వేల దేవయుగములు బ్రహ్మకు నొక యహోరాత్రము.

దైవే యుగ సహస్రే ద్వే
బ్రాహ్మః కల్పౌతు (తౌ నృణాం)
మన్వన్తరంతు (దివ్యానాం
యుగానా మేకసప్తతిః) ౧౩౦

తౌ = ఆ యహోరాత్రములు, నృణాం = మనుష్యులకు, కల్పౌ = రెండుకల్పములు. అందులో పగలు ఉదయకల్పము

రాత్రి క్షయకల్పము మన్వన్తరం ఈ ౧ దివ్యానాం యుగానాం = దేవయుగములు యొక్క- ఏకసప్తతిః = డెబ్బది యొకటి గూడినకాలము పేరు.

సంవర్తః ప్రళయః కల్పః క్షయః కల్పాన్త ఇత్యపి, (స్త్రీ) పఙ్కం (పుమాన్) పాప్మాపాపం కిల్బిషం కల్మషం. ౧౩౧ కలుషం వృజినైనో ఽఘ మంహో దురితం దుష్కృతం స్యాద్ధర్మమస్త్రియాం పుణ్యశ్రేయసీ సుకృతం వృషః. ౧౩౨

సంవర్తః, ప్రళయః, కల్పః, క్షయః, కల్పాన్తః, ఈ ౫ ప్రళయకాలము పేరులు. పఙ్కం పాప్మ, పాపం, కిల్బిషం, కల్మషం, కలుషం, వృజినం, ఏనః, అఘం, అంహః, దురితం దుష్కృతం, ఈ ౧౨ పాపము పేళ్ళు. ధర్మః, పుణ్యం, శ్రేయః, సుకృతం, వృషః, ఈ ౫ పుణ్యముఁబేళ్ళు.

ముత్ప్రీతిః ప్రమదో హర్షః ప్రమోదామోద సమ్మదాః, (స్యా) దానన్దథురానన్దశ్శర్మశాతసుఖానిచ ౧౩౩

ముత్, ప్రీతిః, ప్రమదః, హర్షః, ప్రమోదః, ఆమోదః, ఆనన్దథుః, ఆనన్దః, శర్మ, శాతం, పా॥ సాతం సుఖం ఈ ౧౨ సంతోషమునకుఁ బేళ్ళు.

శ్వశ్శ్రేయసం శివం భద్రం కల్యాణం మఙ్గళం శుభం,

శ్వశ్శ్రేయసం, శివం, భద్రం కల్యాణం, మఙ్గళం, శు

